

# తారకాలింగద్విశతిస్తోత్రము:



ఇది

చేగంటి సుబ్రహ్మణ్య శాస్త్రులవారిచే

రచియింపఁబడి

తణుకు

శ్రీశారదామినీముద్రాక్షరశాలలో

మొదటికూర్పు

1000 ప్రతులు.

డి. వి. రమణారావుగారిచే

ముద్రింపఁబడి

గ్రంథకర్తగారిచేఁ బ్రకటింపఁబడియె.

 1910 [వెల రు 0-2-0.

శ్రీరామచంద్ర.

## కృతిప్రశంస.

మీ శ్రీతారకాలింగద్విశతిస్తోత్రము నామూలాగ్రముగఁ జదివితిమి. ఇందలితారకాలింగమహామహిమాభివర్ణనము భక్తజనహృదయానందకరమై యున్నయది. కవిత్వము రసవంతమై మధురమై ప్రౌఢమై యలరారుచున్నది. కల్పనముం జూచినఁ జిన్నపద్యములో విశేషాభిప్రాయముం జెప్పఁ వ్రాయఁగలయీకవీంద్రునిసామర్థ్యము వెల్లడి యగుచున్నది. శైలి స్ఫుటమై వెలయుచున్నది. పారాయణానుకూలముగఁ జిన్నపద్యములతో రచియింపఁబడిన యీగ్రంథము ప్రసన్నులగుమహానియులకు మహోపకారిగానున్నది. ఇందలిమానసికపూజామాల్యప్రాశస్త్యము లీకవివరుని ప్రసన్నధ్యానం బనన్యసాధారణమైనదని చెప్పక చెప్పుచున్నవి. మఱియు —

215 క. హితశుచిరుచిరాపాఙ్గా * * * * * *

అనుపద్యముం గాంచిన నీకవికిం గలయాత్మగౌరవము తేటపెల్లము గాక మానదు. ఈకవికి నాంధ్రగీర్వాణములయందు సమానసాహిత్యము న్నయది గ్రంథములవలన మనము తెలిసికొనఁగలము.

207. క. కమలాభవాద్యమరులు! గడచి * * * *

అనుపద్యమువలన నీమహనీయునిహృదయంబున నెట్టియవ్యాజభక్తి పూర్తిఁ బ్రభవించి యున్నదియో, భగవన్మయమున నీనుతీవరున కెట్టిసద్భావము కుదిరియున్నదియో సుబోధము కాఁగలదు. భగవన్మహిమాభివర్ణనంబునఁ బ్రవర్తించు నీకవివరుని వాగ్ధోరణి భాగీరథీప్రవాహవేగంబు ననుకరించుచుండును. ఈకవికిం గలయీధారాళకవనసామర్థ్యమును మే మనేకసారులు చూచి యానందించి యుంటిమి. ఇందలి.

108. క. హరిగురు * * * * వెం
దజీథిలోనజ్ఞినను * * * *

అనుపద్యముంబట్టి చూడఁగాఁ జిరకాలమునుండి గజకచ్ఛపములపోరు నుండోలి వచ్చుచున్న రేఫశకటరేఫవిభేదవిషయమున నీకవి యుదాసీనుఁడై యున్నట్లు తోఁచుచున్నది.

40. క. ఎండెండలు * * * * నా
యందిచ్చుపూజ* * * *

66. క. వందిహాయము * * * * పతు
లందియ * * * * *

అనుపద్యములయందు ప్రాస్వైకేకారసంధియు,

137. క. నాదనిషాదంగిశలను * * * * * * ర్తే
లూదుకొ* * * * * * * * * *

అనుచోటఁ గొనికి కాదేశమును,

117. క. ప్రణవాంచిత * * * * * * * *
మణిఖచిత * * * * * * * * *
ఘనసమితి * * * * * * * * *
ఘన! రాగిదె * * * * * * * *

అనుచోట, గలుఁ బ్రాసమును గన్పట్టుచున్నవి. ఇట్టివి రచనాసౌలభ్యమునకై నిరాఘాటముగఁ బ్రయోగింపఁబడినవే గాని, సామర్థ్యలోపము వలనఁ గాని, ప్రమాదమువలనఁ గాని ప్రయోగింపఁబడినవి కావని తలంచెదను. ప్రాపంచికానుభవమును, పాండిత్యమును పరిపూర్ణముగాఁ గలయిమ్మహాకవి యింకను వివిధవిషయములఁ గూర్చి సద్గ్రంథముల రచియించి లోకోపకారముం జేయ నోపుఁగాక! పరమేశ్వరుం డీవిద్వత్కవికిఁ జిరాయురారోగ్యము లొసంగుఁగాక!

ఇట్లు

తణుకు.
6-6-1910.

సుకవిధేయులు,
వేంకటపార్వతీశ్వరకవులు.

శ్రీ ఉత్తర తారకాలింగశివమూర్తయేనమః

# తారకాలింగప్రస్తావము

---

శ్లో. ఆకాశే తారకాలింగం పాతాళే హాటకేశ్వరం
మర్త్యలోకే మహాకాళం దృష్ట్వా కామితమాప్నుయాత్.

ఆర్యులారా! యాకాశమునం జెందు తారకాలింగము శివావతారములలో నొకటి. తొల్లి విరించి సరస్వతిం సృజించి యామెను వలపునం గలియంగోరినట్లును నంతనా భారతీదేవి తన్ను సృజించిన ధాతాత యెడల భర్తృభావంబు సేయనొల్లక తనపై నురులునం ద్వారమున వెడలిం చనుచి సురిగి పోదలంచి హరిణరూపంబున నంబరంబునం బారుచుండ దన్నిష్టసిద్ధికై తరిమికొనివచ్చు నా ధాతకు నీతిల్లి యున్నారన్ని పరమేశ్వరుం గూర్చి పరిదేవనం బొనర్చిన స్మరహరుం డతిమోహింగి కరణరాసనంబులుగొని యటవేగందోచి వేటకాసితనంబు దోప మృగరూపుండైన యప్పరమేష్ఠి శిరంబు నిజశరాసనంబునం జేసినయు, నాంటనుండి నేంటివఱకు నయ్యార్ద్ర తనుగా నాకృతి నప్పుడుపతి విరుపక యుత్తరపక్షంబున మసలుచుండెననియుం, బుష్పదంతుండను గంధర్వవరుండు శివమహిమ్న స్తోత్రంబునందు (ప్రజానాథం నాథ) యను శ్లోకంబునం జెప్పియున్నవాండు.

కొన్ని చరనక్షత్రములమంతలమై లింగాకారముగాంగప్పట్టునీపావనమూర్తికి మృగశిరయనునక్షత్రములుమూడు శిరస్సు. దానికిందిగువనున్న యార్ద్రానక్షత్రమును నంతటివేఱొకచరనక్షత్రమును నా దేవునికి భుజద్వయము. ఆక్రింద నొల్లకావడి యను నైదుచుక్కలాస్వామికి మధ్యము. మఱికొన్ని చిన్న చుక్కలచే రాక్రిందంగానవచ్చును. దానిక్రింది

ఇందు విశేష సహాయంబులు జూపిన ముందుకూర్పున పఠించుకొనవలెను. తారకాలింగ మహాత్మ్యంబులు నాయనుభవ సిద్ధంబులు చాలగలవు. అవియును; మహారహస్యంబును, బుధజన శ్లాఘాపాత్రంబును నైన లింగస్వరూపనిరూపణంబునుం గూడ రెండవ కూర్పునందే ప్రకటింప దలంచి గ్రంథవిస్తరభయంబున నిట విరమించితి.

శ్లో. (సత్యపూతాంవదేద్వాచ) మ్మను విధివచనాను సారముగ నే దెలిపెద. ఈమానసికపూజావిధాన శివస్తోత్రము నామూలాగ్రముగ భక్తితో పఠించిన నాకేదియో దైవమహాత్మ్య గనుచువచ్చితి.

ఇట్లు విధేయుడు,
చేగంటి సుబ్రహ్మణ్యశాస్త్రి,
తిరువూరు కృష్ణాజిల్లా.

# శ్రీతారకాలింగద్విశతిస్తోత్రము. శ్రీ



క. శ్రీమహిళాలంకృతనిజ
ధామున్ భక్తాభయప్ర * దానవదాన్యున్
మామకహితసిద్ధికై
సామజముఖు నాదిపూజ్యు * శంకరుఁ గొలుతున్.

క. వాణిన్ వీణాపుస్తక
పాణిన్ బరమేష్ఠిరాణిఁ * బ్రాణిహృదంత
ర్వాణిం బదవినమితగీ
ర్వాణిం బ్రార్థింతు నాదు * వాక్కు దలిర్పన్ 2

క. వినువీథి నిన్నుఁ గన్నను
కనవా పట కాంక్షితములు * కని నిన్ను భజిం
చిన మోక్షకాంక్ష దీరదె?
కనుకిటు నిను గొల్తుఁ దార * కాలింగవిభూ 3

క. ధరను మహాకాళుని నం
బరమున నిను హాటకేశుఁ * బాతాళమునన్
వరుఁడుగని కాంచి వాంఛలు
కరమని మును లరరె? తార * కాలింగవిభూ. 4

క. కరచరణాదులు, గంగయుఁ
జరతారల నమరఁ జదలఁ * జరియించుమహా
పురుషా! లింగాకృతిశం
కర ప్రొక్కెద నీకుఁ దార * కాలింగవిభూ. 5

క. మరినదిని బూని ఖేచర
పరివృత్తము ...ంటుధవళ * భావలిమదిగం
బరమూర్తిఁ గొనుట నిన్నుశం
కరునిగ నెంచితిని దార * కాలింగవిభూ. 6

క. మృగశిర శిరమార్ద భ్రుజం
బగుటన్ నమ్మూర్తి ఖేచ * రాంగుఁడు నగునా
భగవంతుఁగ నినుఁ దలచితి
గగనవనవిహార! తార * కాలింగవిభూ.

క. జగదు దయస్థితివిలయము
లగులింగస్థలము నేవ * యని తెల్పుటకో
భగవానుఁడ లింగాకృతి
గగనమునఁ జరింతు తార * కాలింగవిభూ. 8

క. సీవార్ణ్నల లగపడి యి
ష్టావాప్తిని, మృతిని సీత * లగపరుపకయుఁన్
నీ విటు సూచింతువు కద
కావేన్మాత్రాత్మ! తార * కాలింగవిభూ. 9

క. జ్ఞానములువెట్టులగలను
జ్ఞానము వృత్తివలె నీవు * చరతారలచం
దానను మనలుట కుజనులు
జ్ఞానక యుండుటకో? తార * కాలింగవిభూ. 10

క. నిన్ను బోధానందజ్యో
తినిగా బోధింప నోపి * తిలకించిన వే
త్త సొనంగు జ్యోతిరూపునఁ
దునగనల కరుణాబ్ధి తార * కాలింగవిభూ. 11

క. తరియింపఁ బాత్రులగునీ
వరభక్తుల నెఱుఁగ కొఱకు * బహిరంగముగాఁ
దిరుగుబహిస్తారక! నీ
కరుణకుఁ జేమోడ్తుఁ దార * కాలింగవిభూ. 12

క. నినువంటిస్వయంభూ చే
తనతేజోదివ్యలింగ * దైవ మిఁకెందుం
గనరాము సమితభక్తిం
గని నిన్ను భజింతుఁ దార * కాలింగ. 13

క. వనజాసనుండు తన తన
యను వలచిన నతని నొంచి * యాదోషముఁ బా
పిననీదుపూతచరితము
ఘనవిభవము నెంతుఁ దార * కాలింగ. 14

క. తను వలచితోడరునజాభయ
మున మృగియై యింటఁబఱచి * మొఱలిడునజునం
వనఁగావ వెలసినదయా
ఘనమూర్తీశరణు తార * కాలింగ. 15

క. అంబరవసమున మృగయా
డంబరముం బూని మృగవి * డంబనపరుఁడై
నంబుజభవు నేసినకథ
కం బాయనిరాయ! తార * కాలింగవిభూ. 16

క. కేవలము భక్తిహీనమున
కై వెలసి సదా దివిన్ ద * ఘన దితుగు నిర్జ
సేవించిన గైవశములు
కాదేమేల్లిల్లఁ దార * కాలింగ.

క. దూరస్థున కర్చన సమ
కూరదు తమి యున్న; గాన * గొలిచెద సద నా
త్మారాముఁ నిన్ను నీసా
కారత నెదఁ జూపు తార * కాలింగ 18

క. నిను శ్రుతి ప్రాణేష్వంత
ర్మనసోలింగ,, మనఁబట్టి * మదిలో నీయు
న్కి నెఱింగి నిన్ను నామదిఁ
గనరా వేఁడితిని దార * కాలింగ. 19

క. కనుచీఁకటియును నీజగ
మును లేనిదివిన్ నమంత్ర * బోధింపుమయా!
వెనుక న్నీసగుణాకృతిఁ
గనఁబఱుపు జోహారు తార * కాలింగ. 20

క. బహుపుణ్యాలభ్యమానీ
మహానీయపురూపుఁ జూపి * మ్మామకపూజా
బహుమాన మొంది నను భవ
వహానముఁ దాఁటింపు తార * కాలింగ. 21

క. కమదోయిసందుఁ గని లో
మునిరాయలు వడసి తలమ * బూచెడిబోధా
మణిరాజమ! నినుఁ గాంచుట
ఘనభాగ్యము కాదె? తార * కాలింగ. 22

క. సదయా! నినుఁ జూవవయే
సద నన్ను భవాబ్ధి ముంచు * నిటు గాన భవ
త్పదసేవకారఁ బెట్టం
గదవే! నామదిని దార * కాలింగ. 23

క. నిను గొల్వఁగల్గిన న్నా
మనసావరుచకల్పనాద * మర్త్యాకృతిపూజల్
కనిమొదవుగాకదయతోఁ
గన రమ్మొకసారి తార * కాలింగ. 24

క. ఘనమందిరము లలంకృతు
లును భోగములుఁ, వినోద * లోపము రాకుం
డ నమర్పనోపు నీకెద
కను కది వశపఱుపు తార * కాలింగ 25

క. అతుకు బ్రతుకు తనువునకే
సతతముఁ గొలువుసేయుఁ గాని * సదయా! నిను స
మ్మతితోఁ దృటికొలువ దిసీ
గతి గావక మనసు తార * కాలింగ 26

క. మతిలోఁగకున్న సత్య
వ్రత! యోగాదికము చనదు * ప్రారబ్ధము నం
తింపఁ గుమువు మనోధీనుల
గతిదుర్గతియొగద తార * కాలింగ 27

క. మనసార నిన్నుఁ గొలిచిన
మనసా రంజిల్లు నిచ్చ * మనవచ్చునిమం
గనవచ్చు నెట్టిఫలమ్ములు
గనవచ్చిన వచ్చుఁ దార * కాలింగ 28

క. జీవులకై నీవునఁగిన
యీవిశ్వ పదార్థములు గ్ర * హింతువె మరలం
గావున నీకు నవార్ఘ్యము
గావించెద మదినిఁ దార * కాలింగ 29

క. నామది కూర్చిన పూజా
సామగ్రిని స్వప్నవస్తు * వటు ధ్వని విడఁబో
కామోదింపుము సత్యము
గా మన్నించుచును దార * కాలింగ 30

క. శివ! సత్సంకల్పనము
ద్భవు సాంకల్పిక శివార్ఘ్య * తతి సత్యంబున్
శివముఁ గద హేతు గుణములు
శివియవె కార్యములఁ దార * కాలింగ 31

క. గురుకరమునఁ జిన్మయులై
హారి! పుట్టి వశిత్వమునకి * వాత్మకులా శ్రీ
గురుపుత్రులకు శివార్చన
కరమది గురునాజ్ఞ తార * కాలింగ 32

క. శివుఁడీయక శివునివశి
త్వవిభూతింబడయుటెట్లు? * వశి కాక
శివుండవునా తలఁకింపదె వను?
గవివినుతా! మోక్షుడు తార * కాలింగ 33

క. శివభావమెడలకుండఁగ
శివభక్తిమనోజయుంబుఁ * జేసి త్రిశుద్ధిన్
శివ! నిన్నర్పించినఘ
కృవరేణ్యులఁ దెలతుఁ దార * కాలింగ 34

క. తనుదేర దేవతలుదె
త్యనికాయము చెలిమి మాటుకుం * బుత్రబుగా
బ్రణవంపు గంటగంటన్
గని విని మొక్కుదుఁ దార * కాలింగ 35

క. మదివత్తి నాదుచమురున
మొదిపి దృగంతర మటన్ప్ర * మిదలో వెలిగిం
చెదఁ జద్దీపము సర్వముఁ
గదిరి కనంబడఁగఁ దార * కాలింగ 36

క. సర్వగతా! సర్వాశ్రయ
సర్వజ్ఞా! సర్వమయ! నీ * సద్గానందా!
సర్వాతీత! మహేశ! య
గర్వత నినుఁ దలఁతుఁ దార * కాలింగ 37

క. ఎక్కడనన నక్కడఁగల
వెక్కడఁ గనరావు నిండి * యును జగములకుం
జక్కఁగ నెడమిచ్చెదవిది
యక్కజముగదయ్య! తార * కాలింగ 38

క. రవిమండలస్థ! భర్గా!
శివ! యవ్యయ! హోత్రి నేత్ర * సితిగళ! సాంబా!
భవహార! నీదర్శన మొసఁ
గవె నినుధ్యానింతుఁ దార * కాలింగ 39

క. ఎందెందఱు నినుఁగొలిచిన
నందం దీవుండి సేవ * లందుచు నిటనా
యందిచ్చు పూజలందవొ
గందోఁచునశంక? తార * కాలింగ 40

క. కనవచ్చిన నీవచ్చిన
గొనవచ్చు న్నిన్ను గొల్చి * కొనవచ్చురునె
ననసేటికిఁ దగులనివిం
గనవచ్చును మనము తార * కాలింగ 41

క. కనవత్తువు పుణ్యులకే
కనవచ్చినవచ్చుమేలు * కావున నీద
ర్శనమును సుకృతఫలంబని
ఘనమతిఁ గీర్తింతుఁ దార * కాలింగ 42

క. పలుకాముల బహుభంగుల
నలసితి నని నాకుఁ గడుద * యన్ నీభక్తిన్
గలిగించితి విఁక నిన్నుఁ
గలిగింపు భజింతుఁ దార * కాలింగ 43

క. జ్ఞానాబ్ధి నీతరంగము
నేనిటు నీవాఁడ నన్ను * నెడఁద్రోయకు దు
ర్జ్ఞానంపుటేటనీవని
కై నినుఁబూజింతుఁ దార * కాలింగ 44

క. దేవా! తనభక్తునకును
దేవునకుందగు నతీవ * తిన్యాయమటుల్
గావున మనకనపాయత
గావలె ధర్మమిది తార * కాలింగ 45

క. కులదైవము వని నాకుం
గలయ ట్లభిమానమేల * కలుగదు నాచో
నిలనిజ భక్తుండని దయ
కలదేని న్నీకుఁ దార * కాలింగ 46

క. కాలాంతక! నీవ్రుగినా
బ్రోలం బాపట్టి నాదు * పూజలుగొనవే
నేలామానును నాకా
కాలునిదండనము? తార * కాలింగ 47

క. అన్నా! యేమయ్యా! దృ
శ్యన్నశ్యమ్మనుటచేఁ బ్ర * సన్నుండవ ప్రగా
ఢున్నావా? నినుఁ బార్థుఁడు
గన్నాఁడు గదయ్య! తార * కాలింగ 54

క. హరియు విరించియుఁ బోరికిఁ
దొరకొన మధ్యస్థుఁడవయి * తోఁపవె సాక్షా
త్పర! తేజోలింగమవై
కరుణింపవె వారిఁ? దార * కాలింగ 55

క. నీవు స్వయంభూలింగమ
వై వెలయవె శ్రీనగాదు * లందుఁ దిరముగా
సేవకవరులఁ గృతార్థులఁ
గావించెదిగొ అకటఁ దార * కాలింగ 56

క. నీయష్టమూర్తులనుసఁట
యీయఖిలము; మిత్తి నొప్పి * తీవటు, [illegible] కే
మీ యింక నాకుఁ గనబడఁ
గాయమహార! నీకు? తార * కాలింగ 57

క. నినువిశ్వమయునిఁ గాంచెద
ననునను దయనీవుఁ జూడ * కది ఫలమిడునే
తనునాదటఁ గననివిభుం
గనినటు వృథ గాక తార * కాలింగ 58

క. నినుఁగన్న భగీరథు పా
వనభావం బెంతయొప్పె * భాగీరథయై
తనవారికిఁ బెరవారికిఁ
గనఁ దారకమయ్యెఁ దార * కాలింగ 59

క. ఏనుడాసి సేవమసిగెడి
నినుఁగన్న ముదంబు, గరిమ * నీపదములఁ బ్రా
లిన నన్ను నెత్తునీకృపఁ
గనకేఁకనివ్వేడుచుఁ దార * కాలింగ 60

క. నినుఁబలుకరింపకున్నను
వినకున్నన్ సిద్ధమునులఁ * విద్యానుభవం
బననేల? మనుజజన్మము
కనినఫలం బేమి? తార * కాలింగ 61

క. రమ్మా! నాచెంతకుఁ బన
మిమ్మా! మ్రొక్కెదను జేర * నిమ్మా! కొలుతుం
గెమ్మా! చెవినామొఱవినఁ
గమ్మా! సదయుఁడవు తార * కాలింగ 62

క. నమ్మితినిను నమ్మనునిను
నమ్మిన క్రిందునొగుల నుల * నరులనుసిరితే
నెమ్మన పాపమ్మన వెసఁ
గమ్మా! సదయుఁడవు తార * కాలింగ 63

క. కాళీముఖ కేళీనళి
నాళీకృత మైపనీక * టాక్షము నాహృ
త్కేళీవని విందాడఁగఁ
గాళీప్రియ! నెఱపుతార * కాలింగ 64

క. మమపక్ష భక్తినాటక
మదనై నాలోన నార్తి * యామును కరుణా
సదనమయి నీకుఁ బ్రియమిదు
గద యది గన రమ్ము తార * కాలింగ 65

క. నందిహయము దిగి మీహతు
లందీయ కరావలంబ * మాశ్రితతతి నా
డెందమున విడియుమా! జిత
కందర్ప! శుభాంగ! తార * కాలింగ 66

క. చిణిచిణి దింధిమి భంభం
క్వణనంబులతోడఁ దూర్య * వాద్యాంబరగాఁ
ప్రణవము మొఱసెను గనుకీ
క్షణమే శుభవేళ తార * కాలింగ 67

క. నాదశ్రుతి మైజల్లు బ్ర
మోదరసం బెల్లకడల * బుణ్యాహముగా
వేదాద్యోంకారం బెది
కాదుశుచిస్థలము? తార * కాలింగ 68

క. రవిచంద్రానల మయమై
భవహరమై విశ్వరూప * భవసమాఖ్యం
దవుహృదయపీఠ మిదె యె
క్కవె నీ పాదుక లొసఁగి తార * కాలింగ 69

క. పాపాంబుద ఝంఝానిల
మాపద్వనదావవహ్ని * యజ్ఞానతమో
దీపం బగునీపాదుక
కాపయ్యెడు నాకు దార * కాలింగ 70

క. సుందరమణిమందిరముల
బొందించెద నుచితపీఠ * ముల నీదరి నీ
సుందరులను నందందని
కం దగువారలను దార * కాలింగ 71

క. కించిజ్ఞుఁడు సర్వజ్ఞుని
కించనుఁడైశ్వర్యధుర్యు * క్రియ నిన్నును నే
గాంచి స్మరించి భజించెదఁ
గాంచెద వాంఛితముఁ దార * కాళింగ 72

క. నీనిజ మిదమిద్ధమనం
గానేర్తునె వేదపురుషు * గతి యోచితం
బై నడువ యుక్తాయుక్తము
గా నుడివెదఁగాక తార * కాళింగ 73

క. శైవాంధ్ర బ్రాహ్మణునకు
శైవాంధ్రస్తవము నేఁత * సాజము కాదే
యేవాడ చిలుక కావలె
కా పేరొకటయ్యె? తార * కాళింగ 74

క. చెవికి న్నోటికి మదికిని
జవులారం గృతు లొనర్చు * సత్కవివరులన్
స్తవము నొనరించెదఁ దక్కిన
కవులం దక్కంగఁ దార * కాళింగ 75

క. నీవే దేవోత్తముఁడవు
కావేని బురత్రయంబుఁ * గాల్చెడి వేళ నే
దేవతలును నినుఁ బెద్దను
గా వలగొనుటేమి? తార * కాళింగ 76

క. నీవే క్రతుఫలదాతవు
కావున్నను దక్షుయజ్ఞ * కర్మము నిష్ఫలం
బావిడిచిన నేవేల్పులు
గావఁగలిగిరయ్యె? తార * కాళింగ 77

క. ఆయువు మితి వ్రాయునుర
జ్యాయుని పలువున్కు లూవ * కతమయునిగ వి
న్నేయుక్తిని నమ్మిరి శుచి
కాయ! ముముక్షువులు తార * కాలింగ 84

క. నినుమోగు తోఁచిదంబర
గనుచో నీయంతు గాన * క దసల్ గని వి
న్వినుతించి తొఁకొ దిగంబరు
గ నవంతత దోఁడదార * కాలింగ 85

క. తలలోఁ జ్యోతిర్లింగము
పొలసి జగద్భోగకాంక్షఁ * బూనఁగ పాల
స్థలి బిచ్చమెత్తుశివుఁడని
కలిగె నొకప్రతీతి తార * కాలింగ 86

క. ప్రళయాంతమందు లోకం
బుల పరమాణువులు నీవు * పూవటచేఁగా
ములబూదిఁ దాల్తు వనుప్రథ
గలుగుట కెడమయ్యెఁ దార * కాలింగ 87

క. కామునీ గాల్చితివే ని
ష్కామత మదిఁ దాల్తువేల * కామునిబూదిన్
దామాఁదో సుజనావ
కామము దయసేఁయ దార * కాలింగ 88

క. వినుసిగ దేవర! పిసిగ
వినుశిఖద్యై కళలనీను * వ్యాళ్లేభమెకా
వన పొంద్దైనను జడలకుఁ
గనవచ్చున రుచులు? తార * కాలింగ 89

క. చను విచ్చితి శిరమొక్కగఁ
దను విచ్చితి వర్ధముప్ప * దగు
మనిచెప్ప నాత్మభూతిన
కనుచిత్తువు భళిర! తార * కలింగ 96

క. కొలువుంటివి వాణునికడ
జలజాక్షున కోటువడితి * సరిరా నీభ
క్తులు కోరినవరముల నీ
గలవాత్సల్యంబు! తార * కలింగ 97

క. అనిఁ గ్రీడి కోడుదువె భ
క్తుపరున్ వశుఁడ వని తార * గోడఁగల్యాంతం
బున హాలికత్రము విధివు
న్నను ద్రాగసి రుద్ర! తార * కలింగ 98

క. భూతహృదంతరములలో
జ్యోతిర్లింగంబ వగుచు * నుండియు నెవ కే
రీతిఁ జరించిన నయితువు
గా! తగు నీశాంతి తార * కలింగ 99

క. ఫాలమునఁ గన్ను, నగమొయి
బాలామణి, సిగ న * జాండ భరితాంబరమున్
గ్రాలు మొయి దాల్చుకంఠే
కాల! నిరుపమాంగ! తార * కలింగ 100

క. రజతాచలకల్పద్రుమ
నిజదేవీకీర్తి పురుష * నిఖిలామలన
త్యజనిష్ఠలకరుణాచ్ఛాం
గ! జయ! వృషతురంగ! తార కలింగ 101

క. కలుగదా! నీసన్నిధిఁ
బలురూపులఁ బ్రమథవరులు * ప్రాచీనులు వా
రలకెఱిఁగి వారియనుమతి
గలుగ నిను భజింతుఁ దార * కాలింగ 108

క. గిరిసింగిణి ధరియించినఁ
గిరిపైఁ జరియించుచున్న * గిరి నందవటు
ద్విర! నేర్పుగఁ గావలతు నీ
కరపదజలజములు తార * కాలింగ 109

క. కోకిలలకు మాధవమును
గేకులకు ఘనాఘనంబు * శ్రీయు నీపదనీ
వాకాలము నా కామిత
కాకోదరహార! తార * కాలింగ 110

క. నానావర్ణము లెస్సగ
మానాన్వితంపుఁ బాత్ర * మం దిడుకొని నీ
మానితపదములు కడిగెద
జ్ఞానామృతధార దార * కాలింగ 111

క. నీపాదజలము చవిగొని
నాపైఁ జల్లుకొనఁ జల్ల * నగునై యది నా
తాపత్రయ ముడుగుటకుం
జ్ఞాపక మని తలఁతుం దార * కాలింగ 112

క. హర! పదపద్మము తనువలె
వరమిమ్మటం బొసఁగు బాంధ * వమున సురేంద్రుల్
ఫరగించినపాద్యము శం
కర! నీకిదఁ గూర్తుఁ దార * కాలింగ 113

క. నిను గాత్యాయని, జాహ్నవి
వినుతించిన పద్యయుగము * వినుమలరింతై
మనమున్ ప్రేదిన నీయొక
గణుతిమెయిఁ బఠింతుఁ దార * కాలింగ 120

క. ఉండనియటుఁ లుండఁగ నెగ
ముండినగతి నిండనెఱుఁగ * కున్నటు లెఱుఁగన్
మొండగు నీపాండిత్యము
ఖండత వెలయుతను దార * కాలింగ 121

క. జగములఁ గని పెంచెడినీ
జగదవిదితబాంధవం బ * దంగూడనైనం
దగు నీజగదీశత చ
క్కఁగ మతి కెక్కుతను దార * కాలింగ 122

క. పొందుగ నీతల యందుఁ
జందనకర్పూర సురుచి * సంపఁగినూనెన్
డెందము మెయి నీమెయి నది
క్రందుగ మర్దింతుఁ తార * కాలింగ 123

క. నీతలనెల వెన్నెల యన
పాతిన్నదుపైన నీక * పర్ధమునందుం
గేశ్చవము రలరెద ని
ష్ప్రీతవముగుభక్తిఁ తార * కాలింగ 124

క. లొద్దుగ పాటిగంధవృకం
దద్దయుఁ బన్నీట పూసి * నలుగిడి నీపై
నిద్దపు చేలం దుడిచెద
గ్రద్దన భావించి తార * కాలింగ 125

క. నాయికతో సఖులంబలె
సాయుజ్యముతోడ నిన్ను * సామీప్యాదుల్
పాయక చేరె మది న్నీ
కాయం బ్బంటగను తార * కాలింగ 126

క. ఈవిశ్వ మమత కుంభము
గావించి శివాత్మబుద్ధి * కై నుడివి మహా
దేవా,, యని యభిషేకము
గావించెద నీకుఁ దార * కాలింగ 127

క. పొంగారుగారుమాపుల
శృంగారరసంబుఁ జొచ్చి * చేయుదు నీకుం
గంగాంబునర్ఘ్యవంబును
గంగోమారమణ! తార * కాలింగ 128

క. సురధేనువు పశుపతి నని
పరమాప్తత నీకొసంగెఁ * బంచామృతముల్
గురుమతి నవి గైకొని శం
కర! నిను స్నపియింతుఁ దార * కాలింగ 129

క. మునిచిత్త మాత్మ తీర్థం
బునవలె స్వక్షేత్రమగు * సభోనదితీర్థం
బున నది మోదరసౌఘము
గను కేళ్వాలాడు తార * కాలింగ 130

క. స్నానాచమనముఁ గొను నా
మానసికాంబువుల భక్త * మానవబహుళో
ద్యానవిహారజలాహము
కావఁగ రాక్షుండఁ దార * కాలింగ 131

క. అచ్చరలు పేర్మి నొసఁగిన
యచ్చంపుంజలువవలువ * నర్థించు నీమే
నొచ్చక తడియొత్తెద నెద
గ్రచ్చుకొనినభక్తిఁదార * కాలింగ 132

క. చేలాంచలమున వీచుచు
బాలాంబిక నీదు మేనఁ * బరిమళ మొలయన్
హేలాగతి ధూపం బిడుఁ
గాలాగురుచేతఁ దార * కాలింగ 133

క. గంధపుఁబొగచే నీజప
లాందడి యుడిగించి భక్తు * లందలిదయ నీ
యందలి తమిఁ దెలిపెడిగం
గం దయఁగని గంట తార * కాలింగ 134

క. దేవరసేవలలో నా
భావసగతిఁ దోడ్పడినని * వాజహన్నమతల్
సేవకజనవత్సల లని
గావింతుం బ్రభను దార * కాలింగ 135

క. నీవూర్ధ్వలింగ మాటను
దేవా! నాలోని యూర్ధ్వ * దేశసహస్రా
రావసతిఁ బ్రసన్నుండవు
గావే పూజింతుఁ దార * కాలింగ 136

క. నాదునిడాపింగళలను
బాదుకలం దొడిగి ప్రణవ * పంచాక్షరికే
లూధుక సుషుమ్నమార్గము
గాఁ దయసేయుగదె! తార * కాలింగ 137

క. శిల్పులశిల్పార్థంబులఁ
గల్పించుముదార! తోలుఁగట్టెద నేలా?
కల్పింతు మహితవస్త్ర
కల్పముఁ దయఁ దాల్పు తార * కాలింగ 138

క. పూనుము విశ్వవిభూతిఁ జి
దానంద విభూతి మన్మ * థాంగప్రభూతిం
బూనుతుఁ మదిం ద్రిరేఖలు
గా నీనమ్ముదుటఁ దార * కాలింగ 139

క. నీనిజము సంతతంబును
గావం బొనరించుమాంస * గాయత్రి సదా
పూను మిదె బ్రహ్మసూత్రము
గా నీకర్పింతుఁ దార * కాలింగ 140

క. పరతత్త్వము దెల్ప జగ
ద్గురు వగునాత్రికాత్మ! నీకు * గురుకట్నముగా
గరు జ్ఞానద మొసఁగెద నెదఁ
గరుణం దాల్పు మిదె తార * కాలింగ

క. గంధద్రవ్యము తెల్లెడ 141
సంధించి జగత్ప్రియంబు సమకూల్పు జగ
ద్బంధూ! గొనుమద్భక్తిన
గంధం బర్పింతుఁ దార * కాలింగ 142

క. తనువున నా కనురాగం
బును దీర్పఁదఁ గుంకుమాంక * ముగనీఫాలం
బునఁ దేరఫాలాంతః
కనదాత్మజ్యోతి దార * కాలింగ 143

క. సురనది మకుటముతో నీ
శిరమునఁ గ్రొన్నెలతురాయి * జేర్చియపర్ణా
గరమున్ గైసేసెద శం
కర! నీమెయినెల్లదార * కాలింగ 144

క. శుకపిక సుముకిసలఫలా
దికమున వని నొప్పాలెఁ * బెక్కు తీర్లగులోక
ప్రకరముచే నీవును పే
ద్యకుశోభిలఁ దలతుఁదార * కాలింగ 145

క. మెయి గంధకలప మలఁదక
యయయరో! వెలిబూది పూఁతు * రా యీశ్వరులెం
దఱునను? నీమెయిఁగలపమె
కయిసేసెద మదినిఁ దార * కాలింగ 146

క. పరిమళము సీనిపుక్కల
పసులవ్వాధిపునైనఁ దాల్పఁ * జనునే? సుమన
స్తరుల వీసనులు గంధా
కరములు దాల్చుమివె తావ * కాలింగ 147

క. మకుటాదిపాముకాంతము
సకలవిభూషలకుఁ దావి * సమకాల్పెనీ క
ల్పకపుష్పకవచమొసవే
ద్యకుఁ దొడిగెద నీకుఁ దార * కాలింగ 148

క. గగనమహాసరసింగల
జగదంబుజకోటిఁ బూవ * నలుపుదు నీకుం
జగదాధారా! మది నీ
గగనశిఖాంతమునఁ దార * కాలింగ 149

క. కుడియెడమకనులు బొమ్మల
నడినాళము దళములైచ * నంగా హంసం
దొడిమెదొడిగి బిల్వాచ్ఛర
కడు నిట్లానరింతుఁ దార * కాలింగ 150

క. కొండంతటి దేవునకుం
గొండంతయు బత్రియున్న * కొనుభక్తిగ నే
కృండొసఁగితి నూఁగ్స్పినను
ఖండేంకునకట్టి తార * కాలింగ 151

క. అనలముఖంబున నీచం
దన సంకుమదాజ్య మృగమ * దంబులుగొని నీ
యనిలాంగంబున ధూపము
గనుమా యర్పింతుఁ దార * కాలింగ 152

క. కనుచో దహరంబున దో
చిన తారల నాత్మకళల * నేసలనీరా
జనములుగానీ కొసఁగిన
గణుతించుచు నిన్నుఁ దార * కాలింగ 153

క. పరిపక్వభక్తిప్రాచీ
పరిపక్వంబైనవివిధ * పక్వాన్నపరం
పర సాపోశనముగ శం
కరా! కుడువుము కూర్చుఁ దార * కాలింగ 154

క. సురసది సరసరసోపముఁ
బొరిపరసాన్నరుచి సన్న * పూర్ణయు నీకోఁ
బరగించెడి సరసోక్తులఁ
గర[illegible]ఁ బతి[illegible]ఁ దారి * కాలింగ 155

క. గౌరీముక్తాతిలకము
దారకలింగంబు నొకవి * ధం బీజతకుం
గారణమిది మీమీ చెలి
కారముబలమొకద! తార * కాలింగ 156

క. విమలప్రకాశఝరవే
గమునజరించెదరు మింట * గంగయు నీవుం
దమి నెవరి నెవరు పోలం
గమకించిరో తొలుత? దార * కాలింగ 157

క. అని కందువ లాడుచు నీ
యనుగుంజెలు లోనఁగు నుత్త * రాపోశనముం
గొని కొంత విడువ పితరులు
గన నక్షయతృప్తిఁ దార * కాలింగ 158

క. మదిబలితపుమడిలో నీ
పదభక్తులు నాటినట్టి * భావాంకురసం
పద కిష్టదేవతాకృతి
గదిరి ఫలించుఁగద తార * కాలింగ 159

క. నిమురవలెన్ వ్యథ లన్నిఁటిఁ
జిదిమెడినిజనిష్ఠ నబ్బు * చిత్సుఖరససం
పదచే నీవదనామలఁ
గదిసి కడిగి తునుతుఁ దార * కాలింగ 160

క. ఆకుంగ బరాకు, మెయిఁ దమి
పోఁగ, నితరేచ్ఛముక్తై * ములనున్న ముఁగా
నీ కవి తాంబూలం బవు
గాకని యర్పింతుఁ దార * కాలింగ 161

క. కాయత్రయకర్పూరము
నీయంతర్జ్యోతిఁ జేర్చి * నీరాజనముం
జేయుదు నీకిదె నామది
గాయత్రీధ్యేయ! తార * కాలింగ 162

క. శృంగిరిటి వింతనటనలఁ
బొంగుచుఁ గీర్తించు ప్రమథ * ముఖ్యులతో నీ
మంగళ హారతిఁ గొనుమా
గంగార్యులఁ గూడి తార * కాలింగ 163

క. మదియును బ్రాణము దృష్టిం
గుదురౌ తఱి స్వర్ణమంత్ర * కోశము గనఁగా
నదె స్వర్ణమంత్రపుష్పము
గఁదనర్చెద నీకుఁ దార * కాలింగ 164

క. వెలిలోఁ గలనీమహిమం
బులవేలములైన వాని * పొలుకువంబూహం
జలిగొని నీ కొసఁగెద సితి
గళ! పుష్పాంజలిగఁ దార * కాలింగ 165

క. ధ్యానంపుగాము దాఁచిన
జ్ఞానంపుంగొడుగు భక్తి * కరమునఁ గొనఁగా
నానంద చ్ఛాయయిడం
గా నిదఁ బట్టెదను దార * కాలింగ 166

క. సురభిళనవచామరముల
మరువపుఁ జొంపములఁ గూర్చె * మలబిభవాసీ
శ్వర! నీకు రాజసేవా
గరిమన్ వీచెదను తార * కాలింగ 167

క. ఇడుము లిడి పరీక్షింపక
యిడఁడు వరము భక్తులార! * యీశుఁడు ధైర్యం
బుడుగకుఁడీ యంచు భేరిం
గడు మది వాయింతుఁ దార * కాలింగ 174

క. మేరువును మింటసూర్యుఁడు
తిరుగ నాలోన నిన్నుఁ బ్ర * తిక్షణమును ధా
వారూఢి వలిగొని నమ
స్కారము లొనరింతుఁ దార * కాలింగ 175

క. మతిలో సర్వాంగా లిం
గితభూస్థలినై యజింతుఁ * క్షితిమూర్తీ ని
న్నతిభక్తిఁ బన్ను మేనం
గితమోహుం జేయు తార * కాలింగ 176

క. నాలుక యాడఁగఁ గంఠము
పాడఁగ నూఁచెదను నిన్నుఁ * బుధభక్త మనో
డోలిక సుఖశయనము కల
కాలంబందఁగదె! తార * కాలింగ 177

క. గోవిందరూపిణి మహా
దేవికి నీయుముగు లొత్త * రెమలునె? త్రితలో
కావనముల నే నెత్తెదఁ
గావలములు పాపు తార * కాలింగ 178

క. నందీశుఁడు నీభక్తిం
కొండే నెలకొల్పవలసె * నేనంపుము నే
నుండును కావలి నీకిఁ
కందరముఖ మందుఁ దార * కాలింగ 179

క. పలుజన్మంబులఁ జేసిన
యలవాటునఁ జేసియుందు * నపరాధశతం
బులు నీమపూజయుం దవి
కలిగిన క్షమియింపుతార * కాలింగ 180

క. క్రియలందు భక్తియందును
నయియుండుఁ గొంతకొంత * యజ్ఞతచేనా
ప్రయతనమే ప్రియకరమని
కయి కొనునాపూజఁదార * కాలింగ 181

క. నాకీవె యొక్కదైవము
నీకో వేయాలపడి * నీకల్పుఁడనే
నాకుమహాదేవుఁడవే 182
కాకేగతి నాకుఁదార * కాలింగ

క. యజమాను నరకుసేయుని
స్వజనము వలె విశ్వనాథు * ప్రాపాల్లనిమూ
ర్ఖజనంబగతికమైయు 183
కృజమా! చెకుననఁగఁ దార * కాలింగ

క. నేలవిడిచి సామునువలె
నేలానినువిడిచి ప్రజ్ఞ * లెనయఁగఁ జె
బోలా వైకపరితుదయము 184
కాలికిఁదప్పదురె త్యార * కాలింగ

క. అమితాయువు విధివ్రాయఁడు * దారుటము మా
క్షమమూనఁడు యముఁడుమా
య మొదట నరకముతుద 185
క మిసీ! నరుజన్మ తార * కాలింగ

క. ఘను లెందఱో భువి భువిలో
ఘనుఁడైన, ననంతమాజ * గంటులకెల్లన్
ఘనుఁడౌ నాయమునికిఁ? దా
ఘనుఁడౌ నానరుఁడు తార * కాలింగ 192

క. చింతలకుఁ బుట్టి నిల్లగు
స్వాంతంబున నీదుచింత * జనియింపద
సంతతమమరినవంతల
గంతులకెడమున్నె తార * కాలింగ 193

క. చిరకాల మెఱుఁగు దేవర
పరిపాలన నన్ను నెన్ని * పాల్పఁబడితినో
చిరమరయు వారిభృత్యులఁ
గరుణాళుల్ విభులు తార * కాలింగ 194

క. ఆనంద మయుఁడవగు నీ
కానందంబునకు దాసు * లై మనుజీవుల్
కానంగ దాసు లేకద
కానందాసుఁడను దార * కాలింగ 195

క. నీవే గతి భువనాళికి
నీవేగతిభువనకార్య * నిర్వాహణకళా
కోవిదులగు దేవతలకు
గావే నాకు గతి తార * కాలింగ 196

క. నాశక్తి కొలదినిన్ను మ
హేశా! గొల్చెదనునన్ను * నీవేలుదయన్
నీశక్తి కొలఁది మనకిది
గా శపథం బింకఁ దార * కాలింగ 197

క. పరలోకయాత్రికుఁడు నీ
కరుణాధనముప్పుఁగూర్ప * కడుచేసినచా
పరలోకమందుఁ జిరమే
కరణిక మననేర్పుఁ దార * కాలింగ 198

క. నినువిశ్వామిత్రమౌనివి
యనివిని గురుభక్తిఁగొల్చి * నాఁడనినున్ భ
క్తిని ముక్తిని నాకీవే
ఘనవాత్సల్యమునఁ దార * కాలింగ 199

క. నామది నీపయి నాపయి
నీమదిఁ గేర్పుమిదుభక్తి * నిన్ ముక్తినా
కీమార్గముచెల్లదె? మ
త్కామితమిమామాత్ర తార * కాలింగ 200

క. మతికుదురఁబెట్టి నను నం
పృతియొద్ద దురాశపెట్టి * చెరిమాన్పు ముపా
గతబంధున్ నను శరణా
గతబాంధూ! ప్రీతిఁ దార * కాలింగ. 201

క. మరణముమున్నులుదాఁటం
దరమాయటనిన్నుఁదలఁపఁ * దరమాయానే
ర్పురువడినాకలవడఁగా
గరుణింపగదన్న తార * కాలింగ 202

క. తనుబాంధవాధులవా
సనలఁబలె మోహార్ణవమునఁ * జాలవె? నినుడిం
చినవేళ నంధసౌఖ్యము
గనవానినుఁ గొల్చి తార * కాలింగ 203

క. కనరాదు మరణకాలము
కనునాతఁడిఁగఘము లేఁగి * కబళించు మతిన్
నినువపుడు తలఁపనేరను
కనుకె దెయిది ప్రోవు తార * కాలింగ 204

క. ఆపదలఁ దప్పడినుతుం
గాపాడఁడె నీవునట్లు * కాలభటుల రా
రాపులఁడిదోఁచి తోడ్తోఁ
గాపాడవెనన్నుఁ దార * కాలింగ. 205

క. భువనారామంబులలో
భువనేశ్వరితోడఁ దపసి * పూబాదరింపన్
శివభానకుసుమశయ్యలఁ
గవగూడి సుఖింపుతార * కాలింగ 213

క. శివులుభవద్దంపతులనఁ
బ్రవచన మింకేల వినాకుఁ * భద్రమని నమో
భవభవతే తేశాంకరి
కవినుగ తేయందుఁ దార * కాలింగ 214

క. హితశుచిరుచిరపదార్థ
స్వాత్మైనన్ వింకుసెల్లు * నీశుని కని యీ
కృతినామెతఁ జేసితిఁ ద
ద్గతిఁ గూరిచి నీకుఁ దార * కాలింగ 215

క. సిరిమెచ్చెను హరిమెచ్చెను
మఱియెవరీనీచరిత్ర * మన్నింపరు నీ
చరితకుఁ బాలకులకునీ
కరుణాంగోరయున్నె? తార * కాలింగ 216

క. ఇన్నూటపదార్ కందము
లన్నవరత్నముల గుత్తు * మగుచున్నపరం
బున్నేమానసపూజవ
గ్గన్నెకొనఁగిరివి దార * కాలింగ 217

క. శ్రీరస్తు తవజయోస్తు
ప్రారంభస్యాస్యనిరవ * రాధతయామే
వారయమదఘూసినమ
స్కారాస్తే సవధి తార * కాలింగ 218

సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# ప్రసిద్ధాంధ్ర గ్రంథములు.

—:o:—

| | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|
| 1 | సగ్మదావురుషుత్సీయము. | 0 | 12 | 0 |
| 2 | రాధాకృష్ణ. | 0 | 6 | 0 |
| 3 | సారంగధరనాటకము. | 0 | 6 | 0 |
| 4 | కోకిల. | 0 | 12 | 0 |
| 5 | ప్రచండచాణక్యము. | 0 | 12 | 0 |
| 6 | పాదుకాపట్టాభిషేకము. | 0 | 12 | 0 |
| 7 | విప్రనారాయణ. | 0 | 12 | 0 |
| 8 | విజయరాఘవము. | 1 | 0 | 0 |
| 9 | తారాశశాంకనాటకము. | 0 | 10 | 0 |
| 10 | సువర్ణమాల. | 0 | 8 | 0 |
| 11 | సతీసంయుక్త. | 0 | 14 | 0 |
| 12 | ధనాభిరామము. | 0 | 8 | 0 |
| 13 | శ్రీయాచసూరేంద్రవిజయము. | 0 | 10 | 0 |
| 14 | వణిక్పుగవర్తకోదంతము. | 0 | 12 | 0 |
| 15 | సంగీతద్రౌపదీవస్త్రాపహరణము. | 0 | 8 | 0 |
| 16 | సంగీత రసతరంగిణి. | 0 | 12 | 0 |
| 17 | పుష్పలీలావతి. | 0 | 8 | 0 |
| 18 | చిత్రకథాసుధాలహరి. | 0 | 6 | 0 |
| 19 | నలచరిత్రము. | 1 | 4 | 0 |
| 20 | శైవలినీచంద్రశేఖరము. (మైలైననావలు) | 0 | 12 | 0 |
| 21 | వనవాసరాఘవము. | 0 | 12 | 0 |

ఈ గ్రంథములు వలయువారు డి. వి. రమణారావు అండ్ కో., తేఃఖళ్ళు. కృష్ణాజిల్లా. అని వ్రాయవలయును.

